శ్రీ రస్తు.

శ్రీ వేంకటరమణ సహాయః

** (అవిఘ్నమస్తు శుభమస్తు) **

విశ్వనిఘంటు ప్రథమాశ్వాస ప్రారంభము

(సారంగ శబ్దభేదాని)

శ్లో॥ చంద్రేపద్మమరాళేచ। చాతకేగజభృంగయోః।
వీణావారిదకందర్ప। చాపదీపేషు సారగః॥

టీక॥ చంద్రే- చంద్రునకున్ను, పద్మ= తామరపద్మములకున్ను, మరాళేచ హంసలకున్ను, చాతకి= చకోరపక్షులకున్ను, గజః= ఏనుగులకున్ను భృంగయోః= తుమ్మెదలకున్ను, వీణ= రుద్రవీణలకున్ను, వారిదః= మేఘములకున్ను, కందర్ప= మన్మథునికిన్ని, చాపః= ధనస్సునకున్ను, దీపేషు- ప్రకాశమునకున్ను, సారంగః= సారంగశబ్దము చెల్లును.

క॥ సారంగమురథసారథి సారంగముమ్రాయలేడి సరసీరుహముల్। సారంగమతివయసలుడు సారంగము దంతిచిలుక సలిలంమ్ముభూమిన్॥

రాజశబ్ద భేదాని

శ్లో॥ రాజసూర్యేందుఫాలాక్షే। విష్ణువైశ్రవణేష్వపి।
కాదంబేనృపభక్ష్యేకే। సుపర్ణాః వారిజస్రజా॥

టీక॥ సూర్య= సూర్యునకున్ను, ఇందు— చంద్రునకున్ను - ఫాలాక్ష ఈశ్వరునకున్ను-విష్ణు - విష్ణుమూర్తికిన్ని - వైశ్రవణ - కుబేరునకున్ను - న

షః = రాజులకున్ను, కాదంబః-హంసలకున్ను, వృషభః - ఆబోతులకున్ను, శక్రః = దేవేంద్రునికిన్ని, సుపర్ణః = గరుత్మంతునకున్ను, వారిజః = తామరలకున్ను, రాజశబ్దమునకు చెల్లును.

క॥ రాజనంగ రాజురతిరాజసుర రాజు! ధనదుడరిహారాదులి పొందుచంద్ర! బింబమునకు గరుడ యంబుజంబులకును రాజశబ్దమం దృభోజతిలక॥

హంసశబ్ద భేదాసి

శ్లో॥ హంససూర్యాబ్జ జాహంసా। వారాశిర్వారిజ స్తథా।
అద్రిద్విరేభపంకేజ। చంద్రేవారికరంభసః॥

టీక॥ సూర్యా - సూర్యునికిన్ని, అబ్జజః - బ్రహ్మదేవునికిన్ని, హంసః - హంసలకున్ను, వారాశి - సముద్రమునకున్ను, వారిదః - మేఘములకున్ను, అద్రిః - పర్వతములకున్ను, ద్విరేభః - తుమ్మెదలకున్ను, పంకేజ - తామర పువ్వులకున్ను, చెందిరి - చంద్రునకున్ను. వారికరః - కొలనులకున్ను, అంభసః - నీరకున్ను, అనియీ 12 న్ను, హంసశబ్దమునకు చెల్లును॥

సీ॥ అరుణకాంతికమరు అంబుజాంబుజములు గిరులువిహగరాజసురలకొప్పు* చంద్రమండలముకు, జలబిందువులకునీహంసశబ్దమందృకంసహారా॥

నీలకంఠ శబ్దభేదాసి

నీలకంఠమయూరేస్స్యా। స్త్రహంవాసిచసన్నగః।
గ్రామేశ్వరాధ్రిసిచ సోరా నీలోత్పలప్రతిబింబకః॥

టీక॥ మయూరః — నెమళ్లకున్ను, గృహావాళీ = పిచ్చుకలకున్ను, పన్నగః పాములకున్ను, గౌరీధరః = ఈశ్వరునకున్ను, అభ్రనిచయః = మేఘసమూదాయమునకున్ను = నీలోత్పలః — నల్లకలువలకున్ను, ప్రతిబింబకః = ఒకవస్తువునందు ప్రతిఫలించిన కాంతికిని ఈ 7న్నూ నీలకంఠశబ్దమునకు చెల్లును.

గీ॥ నీలకంఠమనగ నీలంబునకు పేరు। నీలకంఠమనగ నిశియు శైశియు* గౌరివిభుడు పిచ్చుకలు సర్పములు నల్లకలువపూలు కారుమొగులూ॥

## సారస శబ్ద భేదాని

శ్లో॥ సారసేచాంద్రియెకాంతే నళినేపంకజాకరే।
చాతూర్యవచనావేవ। నీరక్షీరసుధారసః॥

టీక॥ చాంద్రియెకాంతే - వెన్నెల కాంతికిన్ని, నళినే - తామరపద్మములకున్నూ, పంకజాకరే - తామరకొలనులకున్ను, చాతుర్యవచనే - చతుర్యమైనమాటలకున్ను నీరః - మంచినీళ్లకున్ను, క్షీరః - పాలకున్ను, సుధారసః - అమృతమునకున్ను ఈ 7 దున్ను సారసశబ్దమునకు చెల్లునూ॥

గీ॥ సారసంబనంగ సర్వేంద్రియంబులు* సారసంబనంగి సరసిజములు సారసంబనంగ చంద్రోదయకాంత్రి* సారసంబుయమృతసాగరంబూ॥

## అండజ శబ్దభేదాని

శ్లో॥ అండజావిహగాభోగి। గోధిరంగృహంగోధికం।
శుకేషుసరటశ్చైవ పృథురోమశ్చకుకుటః॥

టీక॥ విహగః— పక్షులకున్ను, భోగీ— పాములకున్ను గోధికః= ఉడుములకున్ను గృహగోధికః=బల్లులకున్ను, శుకేషు- చిలుకలకున్ను, సరటః= తొండలకున్ను. = పృథురోమః=చేపలకున్ను - కుక్కుటః= కోళ్లకున్ను, అనినీ ఈయిన్ని అండజశబ్దమునకు చెల్లును,

క॥ అండజమువిహగభుజగము అండజముపిపీలకంబులా జలచరముఁ* తొండలునుమఱ్ఱికుక్కుట మండజ శబ్దంబనంగ యోగానుమురారీ* *

సూత శబ్దభేదాని

శ్లో॥ సూతపౌరోహితో దేవో ద్వారదో అశ్వసారథిః।
యానపాత్రాదికో విద్వాన్ సత్కవిక్రమ పాఠకః ॥

టీక॥ పౌరోహిత= పౌరోహితునకున్ను, దేవః— దేవతలకున్ను, ద్వారదః కొమ్మచేనుగునకున్ను, అశ్వసారధిః,- గుఱ్ఱపుసవారీకిన్ని, యానపాత్రాదికః- వాడనడిపెసరంగులకున్ను, విద్వాన్ = విద్వాంసులకున్ను, సత్కవిః= గొప్ప కవీశ్వరులకున్ను, క్రతుపాఠకః= సంగీతవిద్యచెప్పెవారికిన్ని, అనినీ ఇదిన్ని సూతశబ్దమునకు చెల్లును,

గీ॥ సూతశబ్దమయ్యె సురలుతాపసులకు * పండితునకుకవికి
పాటకునకునావగడుపువాని కీవిదముసపేర్లు కవులకెల్ల
భద్రగజముసకును॥

(ఖేటక శబ్దభేదాని)

శ్లో॥ ఖేటకో మేఘచంద్రార్కో సమీరః పక్షి రాక్షసః।
తారాగ్రహ ద్యుతిక్షేత్రో ద్వాత్రింశతోక్తిటీనిర్జరః ॥

టీక॥ మేఘః= మేఘములకున్ను, చంద్ర- చెంద్రునకున్ను, అర్క—సూర్యునకున్ను, సమీరః వాయువునకున్ను, పక్షిః= పక్షులకున్ను రాక్షసః=దానవులకున్ను, తారః= చుక్కలకున్ను, గ్రహాః— నవగ్రహంబులకున్ను,విద్యుతిః= మెరుపుబాయకున్ను, ద్వాత్రింశత్కోటినిర్జరః— ముప్పదిమూడుకోట్లదేవతలకున్ను, ఈ10న్ని ఖేటకశబ్దమునకు చెల్లును

ఉ॥ ఆటకమింద్రచాపమును అసురవర్గముపక్షిజాతులుం *
ఖేటకమెన్నవిద్యుతియు ఖేచరముఖ్యులు తారసూర్యముఃకోటిసురుల్*మునీశ్వరులు ఘోటకముల్ రిపువర్గమెన్నగా* ఖేటశబ్దమందురు గజేంద్రఫణాఫణి భూషసన్నుతా॥

(నిర్జీవ శబ్దభేదాని)

శ్లో॥ నిర్జీవోయాన పాత్రంతు భేరీదుందుభిభైరవః ।
ఘటపటాద్యాయుధంచైవాశింజినీ ఘటితారవః ॥

టీక॥ నిర్జీవః - నిర్జీవశబ్దము యానపాత్రంతు - నావకున్ను భేరిః - రణభేరికిన్ని, దుందుభిభైరవః - మద్దెలమొదలయ్యినవాయిద్యములకున్ను, ఘటః - కుండలకున్ను, పటః - వస్త్రములకున్ను, ఆయుధః - బత్తీసుఆయుధములకున్ను, శింజినీ - ధనస్సుకున్ను, ఘటితారవః- సొమ్ములుమొదలయిన తాకుడుశబ్దమునకున్ను, యీ 8దిన్ని నిర్జీవశబ్దమునకు చెల్లును.

క॥ నావకువాయుద్యమునకు । శ్రీవిభవములకును విగ్రహాని త్తరువ్వులకుఁ* భావింపన్నాయుధమ్ములకు మానితనిర్జీవశబ్దమే నగాంబరగుఁ॥

(కాకొదర శబ్దభేదాని)

శ్లో॥ కాకోధరః కాకఘూకా యాతుధానా భ్రసంఘ హయాః।
పన్నగేశ క్రౌంచపద కాకోధర సువాచకః॥

టీక॥ కాకః = కాకమునకున్ను, ఘూకః = బండిగూబకున్ను, యాతుధానః = రాక్షసులకు, అభ్రసంఘః = మేఘసమూహములకున్ను, పన్నగః పాములకున్ను, ఈశః = ఈశ్వరునకున్ను క్రౌంచపద = చక్రవాకపక్షులకున్ను, సువాచకః = లెస్సయినమాటలకున్ను, యీశిదిన్ని కాకొదరశబ్దమున కు చెల్లును,

క॥ కాకముఫణిమర్కటమును కాకముగుద్రంబు మొసలిక
డుసూకరముగ* కాకిముతిమిరతుషారము కాకోదరశబ్దమునగ
కంజదళాక్షా॥

(నిరాకార శబ్దభేదాని)

శ్లో॥ నిరాకారం తరిక్షంతు విష్ణుప్రేమవుమాపతిః।
మారుతంమన్మధావేశం నిరాకారప్రముచ్యతే॥

టీక॥ నిరాకారః - నిరాకారశబ్దము అంతరిక్షంతు - అంతరిక్ష ఆకాశమునకున్ను, విష్ణుః - శ్రీమహావిష్ణుకున్ను, ప్రేమవలపుకున్ను ఉమాపతిః - ఈశ్వరునకున్ను మారుతః - గాలికిన్ని, మన్మథః మన్మదునికున్ను, ఆవేశః - ఆవేశానకున్ను, యీ 7దున్ను నిరా5 ల్లును.

క॥ హరిహరులుత్తజుండును * మరియావేశంబుగాలి మ
రేణువులుగ * ధరనెన్నగగనమార్గము అరయునిరాకారశబ్ద
మసురకులారీ॥

(గజశబ్ద భేదాని)

శ్లో॥ గజచంద్రనిధిర్రత్నా గజేంద్రాశ్చ గణాదిపః।
నీరజానీలకంఠశ్చ జాహ్నవీ గుప్త పాదపః॥

టీక॥ గజః గజశబ్దము, చంద్ర— చంద్రునకున్ను, నిధిః—పద్మనిధికిన్ని, రత్నా— రెల్లుగడ్డికిన్ని, గజేంద్రా— శ్రేష్ఠమైనయేనుగకున్ను, గణాదిపః— విఘ్నేశ్వరునకున్ను, నీరజః తామరపద్మములకున్ను, నీలకంఠః— ఈశ్వరునకున్ను, జాహ్నవి— గంగానదికిన్ని— గుప్తపాదపః— సర్పమునకున్ను యీ 9 టిన్ని గజశబ్దమునకు చెల్లును.

క॥ గజమనసింధుచెంద్రుడు * గజమనగాగంగతుంగ గణప
తిశివుడున్ * గజమనగరెల్లు తంగెడు గజమనగా గజము పాముక
మలదళాక్షా॥

(నవనీత శబ్దభేదాని)

శ్లో॥ నవనీతామృతందుగ్ధం। పయోరూపం ఘృతం సుఖం।
శృతిపదక్షీరసారాచ సత్ఫలంచమధుంవ9జః॥

టీక॥ నవనీతః - నవనీతశబ్దము అమృతః - అమృతమునకున్ను, దుగ్ధః-పాలకున్ను, పయోరూపః - నూతనమైనవయస్సుకున్ను ఘృతః - నేతికిన్ని, సుఖః - సొమ్మదికిన్ని శృతిశ్పద వేదవచనమునకున్ను, క్షీరసారః- వెన్నకున్ను సత్ఫలః - మంచిఫలాలకున్ను మధుః - తేనెకున్ను, యీ 9 దిన్ని నవనీత శబ్దమునకు చెల్లును

క॥ నవనీతమ్మమృతధారలు నవనీతము వెన్న తేనె నవ యవ్వ

శ్లో॥ విశ్వాసి ఘంటు.

నమ్రుల్* నవనీతమధురఫలములు జవముబలంబునకు నిట్టిశబ్దంబ య్యెన్॥

(చింతామణి శబ్దభేదాని)

శ్లో॥ చింతామణిర్భాస్కరోఽప్యింద్రోఽప్సరసో దివ్యవిగ్రహాః।
స్వర్ణవిద్రుమహుతాశనాని విద్యుతిరత్నసన్నిభః॥

టీక॥ చింతామణిః- చింతామణిశబ్దము, భాస్కరః- సూర్యునకున్ను, ఇంద్రః- దేవేంద్రునకున్ను, అప్సరః- దేవతాస్త్రీలకున్ను, దివ్యవిగ్రహాః- మంచి విగ్రహములకున్ను, స్వర్ణం- బంగారునకున్ను, విద్రుమః- పగడానకున్ను హుతాశనః- అగ్నిహోత్రునకున్ను, విద్యుతిః" మెరుపునకున్ను, రత్న" నవరత్నములకున్ను, సన్నిభః" మంచికాంతికిన్ని, యీ10న్ని చింతామణి శబ్దభేదమునకు చెల్లును.

గీ॥ చింతామణి సూర్యేంద్రులు। చింతామణిసొగసుకన్యచెలువపుబొమ్మల్, చింతామణి పగడకనకము। చింతామణిరత్న మెరుపు చెలువుగ కృష్ణా॥

క॥ చింతామణిపసుపంద్రురు చింతామణిరావి రేఖచిల్లరసరుచుల్* చింతామణిరసగంధము చింతామణి తానరాయి శ్రీహరి పేరున్॥

(ఘటశబ్దభేదాని)

శ్లో॥ ఘటాంతరికుంభపవనో కరీంద్రవశ్యైకకళేభరః।
జలోత్కుంభావగ్నిశిఖా తప్తపాత్రతపోవనః॥

టీక॥ ఘటః - ఘటశబ్దము అంతరిక్షః - ఆకశమునకున్ను, పవనః - వాయువునకున్ను, కరీంద్రః - యేనుగునకున్ను, కళేబరః - శరీరమునకున్ను, జలకుంభః - నీళ్లకుండకున్ను. అగ్నిశిఖా - అగ్నిజ్వాలకున్ను, తప్తపాత్రః - వుడుకుతూయున్న కుండకున్ను, తపోవనః - ఋషులఆశ్రమములకున్ను, యీ 8దిన్ని ఘటశబ్దమునకు చెల్లును.

గీ॥ ఘటమనగ వటసమూహము ఘటమన మత్తేభమ్మునకు కుంభ దర్పనకర్ణ* ఘటమనగ తపోవనముకు ఘటముసకీ భువిని జెల్లు పద్మదళాక్షా॥

(భవశబ్ధ భేదాని)

శ్లో॥ భవశ్శిశువోజన్మ ఉద్భవో ధాతమారుతః।
హరీఅజో హరిహ రేంద్రా ప్రద్యుమ్నంచ ప్రబుద్ధుదః॥

టీక॥ శిశుఃవోజన్మ - పిల్లవాళ్లజన్మమునున్ను, వుద్భవః - పుట్టుటకున్ను ధాతః - కడగబడ్డ వాటికిన్ని, మారుతః - గాలికిన్ని హరి - విష్ణుకున్ను అజః - బ్రంహ్మకున్ను, హర - శివునకున్ను హరి -యమునకున్ను, ఇంద్రః ఇంద్రనకున్ను, ప్రద్యుమ్న, - మన్మధునకున్ను, ప్రభుద్భుధః - నీటిబుగ్గకున్ను యీ 10న్ని భవశబ్దమునకు చెల్లును

క॥ భవమన పుట్టువు గిట్టువు భవమన సంసారమన్య భాగంబుల కర్ణ* భవమన పశువగు శిశువగు భవమన గాలియును వానపాపవినాశా॥

(కవిశబ్ద భేదాః)

శ్లో॥ కవిఃకరకరాశుక్రా దేవ వేద్యో దివాకరః।
కవిర్నరః కల్పవృక్షో సవ్యసాచి సహ బ్రమః॥

టీక॥ కవిః= బృహస్పతికిన్ని, కరః= చేతులకున్ను, కరో= చెయ్యాడ మునకున్ను, శుక్రః= శుక్రునకున్ను, దేవవైద్యో- ధన్వంత్రికిన్ని, దివాకరః= సూర్యునకున్ను, కవిర్నరః= కవీశ్వరునకున్ను, కల్పవృక్ష కల్పవృక్షముకున్ను, సవ్యసాచిః-అర్జునునకున్ను, అభ్రః - మేఘముల కున్ను, యీ 9 దిన్ని కవిశబ్ధమునకు చెల్లును

క॥ కవియనగాధ్భవసుతునకు। కవికికవీశ్వరునికమరురాజులకో ప్పూఁ। ధవళాంగునకునుబేరగు।భువి కవిరాజండ్రుకవితపుంగవులె ల్లఁ॥

(ధారాధరశబ్ద బేదాని)

శ్లో॥ ధారాధరకులాద్రీణాం దిక్కరీంద్రనిలాయచ।
కుబేరకొాద్రివిటపీ సంవృతోసత్కులాయచః॥

టీక॥ ధారాగరే- మేఘములకున్ను, కులద్రీ- సప్తకులపర్వతములకున్ను జితే- జయించడముకున్ను, కరి= యేనుగుకున్ను, యింద్రః- యింద్రునకున్ను అనిలా= గాలికిన్ని, చరః= చెరించేవాటికిన్ని, కుభేరః= కుభేరునకున్ను, గొద్రిః- కోపముకున్ను, విటపీ= అరణ్యమునకున్ను, సంవృతః = కూడుకోవడముకున్ను, సత్కులాయచ-సత్కులముకున్ను, యీ10న్ని ధారాధరశబ్దమునకు చెల్లునూ.

క॥ దారాధగశబ్ధంబగు మారుతమును వర్షధారమంచనబరగుఁ* ఘోరగిరివసతఃకాధారంబులకివియు పేళ్లు దానవవైరీ

* * * * *
* * * *

మేఘశబ్ద భేధః

శ్లో॥ మేఘఃకణముఘా మ్యస్త్యం నీరజౌనింద్రచాపకః।
యిక్షుచక్షుత్రిమూలాచా దధీక్షీరఘృతాంభసః॥

టీక॥ మధుపర్కః - స్నానముకుముందుధరించే బట్టకున్ను - మధుయుక్తనీరజః- మకరందముతోయున్న తామరపద్మములకున్ను। ఇంద్రచాపః - ఇంద్ర ధనస్సుకున్ను, యిక్షుః చెక్షుః- చెరుకుకంటికిన్ని - త్రిమూలే - కందమూలాదులకున్ను, దధీ - పెరుగుకున్ను, క్షీరః — పాలకున్ను ఘృతః — నేతికిన్ని అంభసః - గంగకున్ను,యీ 12న్ని మధుశబ్దమునకు చెల్లును.।

గీ॥ మధుపంబుల మధుపర్కము స్వధురమున్ మంత్రంబుద్గతంబుకున్ మధు లేమాంసముయిక్షుఖండరసమున్ మత్తేభమున్ పద్మమున్ మధుక్షీరంబులుయిష్టపుష్పఘటమున్ మందారతోయంబులున్ మధుసారంబనిప్రస్తుతింతురుగదా మందారభూజంబులుల॥

(కిరాతక శబ్దభేదః)

శ్లో॥ కిరాతః కింశుకః కాష్టో దండకారణ్య వాసికః!
ఘృతవ్యాకులతప్తాచ శిద్ధికాచి స్వయాంతథా॥

టీక॥ కింశుకః= చకోరపక్షికిన్ని,కాష్టః- కర్రలకున్ను, దండ కారణ్య వాసికః = అరణ్యమున నుండువారికిన్ని,ఘృతః- నేతికిన్ని వ్యాకులః- వ్యాకులమునకున్ను, తప్తా వ- వుడుకుతూయున్న వాటికిన్ని, శిద్ధికా = భస్మీభూతమైనవాటికిన్ని చిన్మయాంతథా — కట్టులో విడచేవాటికిన్ని, యీ9దిన్ని కిరాతక శబ్దమునకు చెల్లును.

చ॥ పరులతిక్రూరచిత్తులకు పాపకలాపులకున్। విరాళిబోధరునకు మోదకర్రకును దైత్యులకున్। భయబాహకంబులకున్ వి

మలకుకాననంబులకు విద్యుతికిన్| బరిమార్చువానికిన్| అరయ
కిరాతశబ్దమిది అంబుజలోచన యిందిరాధిపా॥

(కలకంఠ శబ్దభేదః)

శ్లో॥ కలకంఠః కేకివర్గో మృదంగో వీణానాదయోః|
అంగనాసుస్వరంచైవా వేణునాదంచభూతికః॥

టీక॥ కేకివర్గః- నెమళ్లసరసధ్వనులకున్ను, మృదంగో- మృదంగధ్వనికి
న్ని, వీణానాదయో- వీణారవానకున్ను, అంగనాసుస్వరంచైవా- స్త్రీకంఠ
నాదములకున్ను, వేణునాదంచ- పిల్లనగ్రపాటకున్ను, భూతికః- వేమ
గంలకున్ను, కలకంఠశబ్దమునకు చెల్లును.

క॥ కలకంఠమునెమలిధ్వని| కలకంఠమృదంగరవము కుంభి
నివీణా| కలకంఠకవికి స్వరమును| కలకంఠముచేణువేమకుంజరవ
రదా॥

ఇది॥ నానార్థ విశ్వ నిఘంటౌ
సకలార్థసారసంగ్రహాపరతో
శ బ్దా ర్థ ని ర్ణ యః
యేకశబ్ద ప్రయోగః
ప్రథమస్సర్గః
సంపూర్ణము:

---

క॥ యీవిశ్వనిఘంటెవ్వరు భావంబుగచదివిరేని పండితుల-
సరిగా భావించిప్రస్తుతింతురు| శ్రీవిభకృపచాత శబ్దశీలుంధరయ
గన్॥



శ్రీ ర స్తు.

శ్రీ వేంకటరమణ సహాయః

* * (అవిఘ్నమస్తు శుభమస్తు) * *

—(ద్వితీయాశ్వాశ ప్రారంభము.)—

(శివశబ్ద భేధః)

శ్లో॥ శివశ్శుభాకరం విష్ణు వివాహో పావక స్తధా।
చంద్ర శేఖరగీర్వాణో పర్వకాలమహోత్సవః॥

**టీక॥** శుభాకరః - శుభప్రయోజనములకున్ను, విష్ణుః - శ్రీమహావిష్ణువుకున్ను, వివాహ - వివాహములకున్ను' పావకః - అగ్ని హోత్రానకున్ను, చంద్రశేఖరః శివునకున్ను, గీర్వాణాః - దేవతులకున్ను, పర్వకాలః- పండుగదినములకున్ను, మహోత్సవః - సంభ్రమములకున్ను, యీ 8 మిదిన్ని శివశబ్దమునకు చెల్లును

క॥ శివమనగవిష్ణుశుభమును। శివమనగాగౌరివాణి విరికిని చేరా।శివమనగశివుడనంబడు। కలికిబృహస్పతికిపేళ్లు కలియసురారీ॥

(దేవశబ్ద భేదః)

శ్లో॥ దేవదేవనరేంద్రాణాం యష్టదిక్పాలకఃకవి॥
గురోర్విష్ణు మహాదేవో సన్మునీబుధరాజఋషిః॥

**టీక॥** దేవః- దేవతులకున్ను, నరేంద్రః- రాజులకున్ను ।యష్టదిక్పాలకః

అష్టదిక్పాలకులకున్ను, కవిః= కవీశ్వరులకున్ను, గురోః- ఆచార్యులకున్ను, విష్ణు. శ్రీమహావిష్ణువుకున్ను, మహాదేవః- శివునకున్ను సన్మునిః సన్మునులకున్ను బుధః- పెద్దలకున్ను రాజఋషిః- రాజయోగులకున్ను యీ 10 ... శబ్దానకు చెల్లును.

చ॥ హరిహరులింద్రచంద్రులు మహామునులు... గవోత్తముల్ గురులకు దేవ పాఠకులకున్। రతిరా... కున్। విరివిగ రాజముఖ్యులకు దేవయనన్ చెలువొందు... పురహరవీరశంకర ప్రభూసనకాదిమునీంద్రవందితా॥

(భావ*శబ్ద భేదః)

శ్లో॥ భావజోద్భవనారీణాం ప్రద్యుమ్నే ప్రీతిమానసః।
ఆవేశానలభూతో వాతభుక్ వాహినీసదా॥

టీక॥ ఉద్భవః - పుట్టువుకున్ను, నారీణాం ; స్త్రీలకున్ను, ప్రద్యుమ్నః మన్మధునకున్ను, ప్రీతిః - ప్రేమకున్ను, మానసః — మనస్సుకున్ను, ఆవేశః పిశాచములకున్ను, అనలః -అగ్నిహోత్రానకున్ను, భూతః - భూతరాక్షసుల కున్ను, వాతభుక్ — పాములకున్ను, వాహినీ - సైన్యానకున్ను, యీ10ని భావశబ్దమునకు చెల్లును.

గీ॥ భావజంబనంగ భావంబు జీవంబు। మరుడు అగ్నిహోత్రము నకుమరియు। భూతగణములకును పుట్టుకును పేరు రజతగిరినివాస భుజగభూషా॥

(కిరీటశబ్ద భేదః)

శ్లో॥ కిరీటగజకంఠీరా మహిషం మేషభల్లుకః।
ఘల్లునో భూషణంచైవా కిరీటంచక్రముచ్యతే॥

టీక॥ గజః = యేనుగుకున్ను. కంఠీరవః = సింహముకున్ను, మహిషః – గే, దెపోతుకున్ను, మేషః = మేకపోతుకున్ను, భల్లూకః = యెలుగుబంటికిన్ని కల్లుకః – అజగమనకున్ను = భూషణః – అలంకారముకున్ను, కిరీటః = కిరీటముకున్ను, చక్రః = చక్రముకున్ను, అననీ 7న్ను కిరీటశబ్దమునకు చెల్లును.

చ॥ కరినరసింహమాహిషము మేకలకుఁ ధర యెలుగుబంటి కిన్ బరుపెడిసవ్యసాచికిని భవ్యతరంబగుభూషణంబుకున్ నరులలో సుందరాంగునకు సంచితవీధికిమేఘువం క్తికిఁ ధరణీకిరీటశబ్దమున్న దైవతరార్యనిధాన శేఖరా॥

(యోగశబ్ద భేదః)

శ్లో॥ యోగయోగీంద్రలగ్నంచా ముహూర్తేం నిమిషంభ వేత్। అద్రుష్టైశ్వర్యలబ్ధంచా తాపసారణ్యవాసితః॥

టీక॥ యోగీంద్రః – యోగపుంగవులకున్ను, లగ్నః – వివాహలగ్నములకున్ను, ముహూర్తః – ముహూర్తములకున్ను, నిమిషః – రెప్పపాటుకున్ను, అదృష్టః – కర్మముకున్ను, అష్టైశ్వర్యః – అష్టభోగములకున్ను తాపసః – తపశ్శాలులుకున్ను, అరణ్యవాసితః – వనవాసులకున్ను, యీ8మిదిన్ని యోగశబ్దమునకు చెల్లును.

మ॥ యోగమునంగపృష్టమును యున్నతసౌఖ్యములర్థలాభ ముఁ త్యాగముమంత్రవిద్యకు వరితంబుకుపర్వాదినంబులెన్నగా యోగుఁకున్మునీవరితుల కొక్క భిదానములై చలంగు భూభాగము నందు పండితసభాంతరశీమలవర్ణనియ్యమె॥

## ఆహారశబ్దభేదః

శ్లో॥ ఆహారమన్నభుక్తంచా ఝంఝూవాతమహారవః।
వార్ధినినదాభ్రఘోషంచా శంఖనాదాద్రికషితః॥

టీక॥ అన్నభుక్తః" అన్నంభోజనం కూడుమునకున్ను, ఝంఝామారుతః " సుడి-గాలికిన్ని, మహారవః గొప్పధ్వనికిన్ని, వార్ధినినదః" సముద్రఘోషకున్ను, అభ్రనిర్ఘోషః" మేఘధ్వనికిన్ని" శంఖనాదః" శంఖ, ధ్వనికిన్ని, అద్రికషితః," పర్వతనాదములకున్ను, యీ ఏడిన్ని ఆహారశబ్దమునకు చెలును.

చ॥ యగునునభోరవంబునకు దగ్రతకోపముకొక్కపేర్పటన్
జగతినిధూమ్రమగాలికిని జంబుగనెన్నసముద్రఘోషకున్ మిగులగ
మేఘగర్జనకు మిక్కుటమౌసమరంబుకెన్నగా నగునునహారశబ్ద
మునద్భుత భీషణనాగభూషణా॥

## విహార శబ్దభేదః

శ్లో॥ విహారభ్రమణంచైవా యానపాత్రానిలోతథా।
మహాభ్రంచమహీజంచ ఝురిజీవమహార్ణవః॥

టీక॥ భ్రమణః — చరించడానకున్ను, యానపాత్రా - నావకున్ను, అనిలః - గాలికిన్ని, మహాఅభ్రః — గొప్పమేఘములకున్ను, మహీజః - వృక్షమునకున్ను, ఝురీ ప్రవాహమునకు. జీవః = జీవముకున్ను, మహార్ణవః సముద్రమునకున్ను, యీ ఎనిమిదిన్ని విహారశబ్దమునకు చెల్లును.

క॥ కరువలికిమేఘపంక్తికి। మరినీటచరించు భుజగమత్స్యంబులకున్। కరియుశ్వసమితికేవే। రరయగవతిఁంచునంద్రు రజతగిరీశా॥

(హాటకశబ్ద భేదః)

శ్లో॥ హాటకస్స్వర్ణలోహంచ పాషాణంచగిరిప్రజః।
దారుమృత్తికతాంబ్రంచ రూపహేమంచమశ్వదుః॥

టీక॥ స్వర్ణః = బంగారమున్ను, లోహః = పంచలోహములకున్ను, పాషాణః – రాళ్లకున్ను, గిరివ్రజః = పర్వతశిఖరములకున్ను, దారుః = కర్రలకున్ను, మృత్తికః = మంటికిన్ని, తామ్రః – రాగికిన్ని, రూపహేమ = కాకిబంగారమునకున్ను, దశ్వదుః = హరిదశమున్ను, యీ 9ది హాటకశబ్దము నకుచెల్లును.

ఆ. వె॥ కనకమునకు మృత్తికాపర్వతములకు। ముచ్చబంగరంబు ముఖ్యరాగి। తాంబ్రిలోహయినుము దారువు పాషాణ। హారిదశంబుజెల్లుహాటకంబు॥

(హరిశబ్ద భేదః)

శ్లో॥ హరిస్సూర్యేంద్రపంచాశ్యో తురగః ప్లవగపన్నగః
మండూకహరిణపోతశ్చ విష్ణుర్యమనిశాకరః॥

టీక॥ సూర్యః- సూర్యునకున్ను, ఇంద్రః - ఇంద్రునకున్ను, పంచాశ్యో- సింహమునకున్ను, తురగః - గుఱ్ఱమునకున్ను, ప్లవగః- కోతికిన్ని, పన్నగః - సర్పమునకున్ను, మండూకః - కప్పకున్ను, హరిణపోతః-లేడిపిల్లకున్ను

విష్ణుః విష్ణుదేవునకున్ను యమః - యమునకున్ను, నిశాకరః- చంద్రునకున్ను, యీలొమ్మిది హరిశబ్దమునకు చెల్లును.

క॥ హరియనగ నింద్రసూర్యులు। హరిగుఱ్ఱము పాముకప్ప హరివిష్ణువగుఁ। హరియముడు లేడికోతియు। హరిసింహముచంద్రుడంద్రు యీయామెడలఁ॥

(అపరంజిశబ్ద భేదః)

శ్లో॥ అపరంజికనకగర్భంచ తప్తహేమతటిల్లతః।
ఖద్యోతభాస్కరంచైవ షోడశత్కళచంద్రికః॥

టీ॥ కనకగర్భః– బ్రహ్మదేవునకున్ను, తప్తహేమః = పుటము వేసినబంగారునకున్ను తటిల్లతః= మెరుపుతీగెకున్ను, ఖద్యోతః= మెరుగుడుపురుగునకున్ను, భాస్కరః= సూర్యునకున్ను, షోడశత్కళచంద్రికః- పదియారుకళలతో నున్న వెన్నెలకున్ను, యీ7ను అపరంజిశబ్దమునకు చెల్లును.

చ॥ జగతినిసూర్యకాంతికి నిజంబుగవిద్యుతికొప్పు నొప్పగాఁ। పగడపుతీగెకు న్నరియు బంగరుగర్భుడు తప్తహేమమున్। ఖగముల పొలగుమ్మకు ప్రకాసితపౌర్ణమినాటి చంద్రుకున్। సొగునపరంజిశబ్దమునునాకజట్గాధర పార్వతీశ్వరా॥

అఘోరశబ్ద భేదః

శ్లో॥ అఘోరమనలంగరళం జంఝూవాతమహారవః।
ప్రళయంకాలహంచైవ నిఘూతాంబుధిఘోషితః॥

టీక॥ అనలః-అగ్నిహోత్రునకున్ను - గరళః - విషమునకున్ను, జంఝూవాతః-సుడిగాలికిన్ని, మహారవః- గొప్పశబ్దమునకున్ను, ప్రళయః- ప్రి

ళయకాలమునకున్ను, కలహః-యుద్ధమునకున్ను, నిర్ఘాతః పిడుగునకున్ను, అంబుధిఘోషితః - సముద్రఘోషకున్ను, యీ 8ది అఘోర శబ్దమునకు చెల్లును.

ఆ. వె॥ ఘోరమనగనగ్ని క్షత్రియయత్నముల్। యాలమునకు ప్రళయకాలమునకు। వాయురవముపిడుగు వార్ధిశబ్దంబుకు।జను నసంద్రపు బాలచంద్రహాసి॥

(గౌరవ శబ్దభేదః)

శ్లో॥ గౌరవం కాలకూటంచ పావకంభద్రపీఠయోః।
అరుణంపీతమూలంచ గౌరవంచభవేస్తథా॥

టీక॥ కాలకూటః - విషమున్ను పావకః - అగ్నిహోత్రునకున్ను, భద్రపీఠయోః- శోభస్కరమైన సింహాసనమునకున్ను, అరుణః - యెరుపుకాంతికిన్ని, పీతమూలః -పసపుకొమ్ముకున్నుయీ 6ను గౌరవశబ్దమునకు చెల్లును.

ఆ. వె॥ గరళమునకునగ్ని కిరణములకు పేరు। భద్రపీఠమునకు భాస్కరునకు। పీతమూలమునకు ప్రియభాషణములకు। గౌరవంబనంగ గరళకంఠ॥

శంకరశబ్ద భేదః

శ్లో॥ శంకరశ్శాల్మలీవృక్షో వర్ణసంకరగార్దభః।
స్ఫటికద్యూతిధావళ్యం శంకరశ్చంద్రశేఖరః॥

టీక॥ శాల్మలీవృక్షః= బూరగచెట్టుకున్ను, వర్ణసంకరః=కులముచెడచినవానికిన్ని. గార్దభః— గార్దభమున్ను, స్ఫటికః= స్ఫటికమున్ను, ద్యూ

తిః = విభూతికిన్ని, ధావళ్యః = తెలుపునకున్ను = చెంద్ర శేఖరః— శివునకు న్ను, యీ 6 శివశబ్దమునకు చెల్లును.

ఉ॥ కొంకకవర్ణహీనునకు గోవృషభంబులు సంకరంబుకున్। శంకయొకింతలేకనునిజంబుగ బూరుగుచెట్టుకొప్పెడిన్। అంకితలేక శంకరునికౌనువిభూతికి ధావళంబుకున్। శంకరశబ్దమంద్రుగిరి జా హృదయాంబుజబాలభాస్కరా॥

(పవిత్ర శబ్దభేదః)

శ్లో॥ పవిత్రంశోభనంలాభం విష్ణులోకవియచ్చరః।
క్షత్రవిప్రంచ వాణిజ్యం విత్రశంఖోదకస్థథా॥

టీప॥ శోభనః - శుభప్రయోజనములకున్ను, లాభః - లాభప్రాప్తికిన్ని విష్ణులోకః - పరమపదవికిన్ని, వియచ్చరః - దేవతులకున్ను, క్షత్రః - రాజులకున్ను విప్రః-బ్రాంహ్మణులకున్ను, వాణిజ్యః -వ్యాపారముకున్ను, విత్ర కొడవలికిన్ని, శంఖోదకః - శంఖములోబోసినఉదకమునకున్ను యీ 12 పవిత్రశబ్దమునకు చెల్లును.

చ॥ కరులకుశోభసంబులకు కాంచనవిద్య పదార్థరాసికిన్ పరమపదంబు దేవతులు బ్రాంహ్మణజాతియు రాజవర్గమున్। న రులనుసత్కులాధిపులు నారయశంఖములోనతీర్థముల్। ధర ణి పవిత్రశబ్దమప దల్తురుపండితులార్యనాయకా॥

అమోఘశబ్ద భేదః

శ్లో॥ అమోఘువేద ఘోషంచా సత్యవాక్యంచసస్పృహః॥

దధిక్షీరమధూన్యాజ్యం సత్ఫలం వ్రతచారిణః॥

టీక॥ వేదఘోషం— వేదరవమునకున్ను, సత్యవాక్యం-నిజమైనమాటలకు న్ను, సద్వృత్తం—సుట్టికావడమునున్ను. దధి, పెరుగుకున్ను: క్షీరః= పాలకు న్ను, మధుః— తేనెకున్ను, ఆజ్యం— నేతికిన్ని, సత్ఫలం= మంచిఫలమును న్ను, వ్రతచారిణః- వ్రతించేశేవానికిన్ని,యీ10అమోఘశబ్దము చెల్లును.

చ॥ జగతినివేదఘోషకు నిజవ్రతసద్ధికిసత్త్వబుద్ధికిన్। మిగుల దధీఘృత క్షమసమిష్టిత పక్వఫలంబులంటికి। న్నగునుయమోఘ శబ్దమని నార్యులునెన్నదురీ ధరిత్రిలో। నగసుతవామభాగ భ వనాశగజేశసురేశసన్నుతా॥

(అఖండల శబ్దభేదః)

శ్లో॥ అఖండలౌషధంచైవా వజ్రివజ్రవియద్ధునిః।
నిఘూర్ణతోయభ్రఘోషంచ నభోలోకనదృశ్యతే॥

టీక॥ ఔషధః - ఔషధమునకున్ను, వ్రజః - వజ్రాయుధమునకున్ను -వ జ్రి- దేవేంద్రునకున్ను, వియద్ధునిః - ఆకాశగంగకున్ను, నిఘూర్ణతః - పిడు గుకున్న, అభ్రఘోషః- ఉరుమునున్న, నభోలోకః-ఆకాశలోకమునకున్ను, అదృశ్యతే - అగుపడనివస్తువుకున్ను, యీ 8 ది అఖండలశబ్దమునకు చెల్లును.

ఆ. వె॥ మందులకును దేవమందుభి కింద్రునకుదగంగకభ్రిఘోష మునకు। సురలదొరకునతనితరవాలుకును జెల్లఖండశబ్దమునకు గ తశకంఠ॥

(అపారశబ్దభేదః)

శ్లో॥ అపారమనలంగరళం పర్వతారణ్యసాగరః।
గగనంభూతలంచైవా నిర్ఘాతంనిస్థలోదకం॥

టీక॥ అనలం= అగ్నిహోత్రానమన్న, గరళం—విషముమన్న, పర్వతః= పర్వతములమన్న, అరణ్యం= అడవికిన్ని సాగరం సముద్రానమన్న, గగనం= ఆకాశముమన్న, భూతలం=భూమికిన్ని, నిర్ఘాతః— పిడుగుకున్న, నిర్మలోదకం= మంచిఉదకముమన్న యీ10 అపారశబ్దము చెల్లును,

చ॥ జగతినిపర్వతంబులు ప్రజావలినద్రియరణ్యసీమగుణ। త
గునలంబునన్విషము తప్తమయంబగులోహమెన్నగా। గగన
ముతారలున్భువియు గల్గినపెన్నదులెల్లనొక్కటం। యగునయ
పారశబ్దమన యంబరకేశ సురేశవందితా॥

(యోగశబ్ద భేదః)

శ్లో॥ యోగయోగాంబరంలగ్నం ముహూర్తంచరకిల్బిషం
కర్మఫలస్సఫలితం సన్యాసాష్టాంగలక్షణం॥

టీక॥ యోగం—యోగముకున్న అంబర = ఆకాశమునమన్న, లగ్నం లగ్నవియమున్న,ముహూర్తః=ముహూర్తములమన్న చరకిల్బిషః=వర్జ ములమన్న కర్మః-అదృష్టమునమన్న, ఫలః—ఫలముమన్న అఫల-వ్యర్థము కున్న సన్యాసః=సన్యసించినవానికిన్ని అష్టాంగలక్షణః=అష్టాంగయోగముకు న్నయీ 8ది యోగశబ్దమునకు చెల్లును.

ఆ. వె॥ కర్మంబులకు యోగ ధర్మంబులివియ త్తలముపకునుసుజా

సఫలములకును మూహూర్తములకు వర్ణమునకునొప్పు నుపేరు కోవిదాంత గోత్రురంగ॥

(అనిమిషశబ్ద భేదః)

శ్లో॥ అనిమిషంచవిహాలోకా సురానీకసురేశ్వరః
మృత్యుంజయమునిశ్రేష్ఠా సనిమిషత్వాతపస్వినః॥

టీక॥ విహాలోక = స్వర్గమునున్ను, సురానీకః = దేవతులనున్ను, అమరేశ్వరః- దేవేంద్రునకున్ను, మృత్యుంజయః శివునకున్ను, మునిశ్రేష్ఠా—మునిముఖ్యునకున్ను అనిమిషః- రెప్పపాటులేనివానికిన్ని, తపస్వినః - తపస్సుజేసేవానికిన్ని, యీ7న్ను అనిమిషశబ్దము చెల్లును.

చ॥ అనిమిషశబ్దజాలముల నంగజుడంగజ సంహారుండు సన్నులును దేవతుల్। ఋషులుమూలవిరాట్టును సభ్రసంఘముల్। జనులలోరెప్ప పాటునికి జెందినవానికి నొక్కపేరిట్ల। దనరును మేశ్వరా దురితదండధరా ధవళాంగసుందరా॥ ~౦

(నరశబ్ద భేదః)

శ్లో॥ నరోనారాయణోవిష్ణు। రామకృష్ణధనుంజయః।
కరీణాంమర్కటంచైవా। మహీనాం మానుష స్తథా॥

టీక॥ నారాయణః = శ్రీమన్నారాయణమూర్తికిన్ని, విష్ణుః = విష్ణువున్ను, రామః = శ్రీరాములకున్ను, కృష్ణః—కృష్ణమూర్తికిన్ని, ధనంజయః = అర్జునున్ను కరిః- యేనుగుకున్ను, మర్కటః = కోతికిన్ని, మహి- భూమికిన్ని, మానుష్యః- మనుష్యునకున్ను, యీ౨ నరశబ్దమునకు చెల్లును.

ఆ. వె॥ కరికిమర్కటంబుకగుపేరునొక్కంట। రామకృష్ణయర్జ నామములకును నరుఁడుభూమివిష్ణు నారాయణస్వామి। కగును నరుడనంగ కాలకంఠ॥

గద్య॥ ఇదినానార్థ విశ్వనిఘంటే
యేకశబ్ద ప్రయోగః
సర్వం ద్వితీయస్సర్గః

ఇయ్యది పూర్వకవులచే రచియింపంబడి
కే. కూర్మనాయకులు అంణ్ నన్నువారి
స్వదేశీభారతీఆఫీసునందు చక్కగాపరిశీలించి
టీక వ్రాయబడి
శ్రీ శీతారామవిలాస ముద్రాక్షర శాలయందుముద్రింపబడియె



శ్రీ వేంకటరమణా సహాయః

విశ్వనిఘంటు.

## తృతీయసర్గప్రారంభము

### (శ్రీశబ్ద భేదః)

శ్లో॥ (౧) శ్రీః కాత్యాయనీ లక్ష్మీ వాగ్దేవీ వైభవ స్తథా।
వివాహోత్సవకల్యాణం ఐశ్వర్యం చయకల్మషం॥

టీక॥ శ్రీ- శుభమునకు, కాత్యాయనీ- పార్వతికిని, లక్ష్మి- లక్ష్మీదేవికిని, వాగ్దేవి- సరస్వతికిని, వైభవః= సంపదకును, వివాహోత్సవః- పెండ్లిమహోత్సవమునకు, కల్యాణం- మంగళప్రదములకును, ఐశ్వర్యం= అభివృద్ధి ద్యైశ్వర్యమునకును, కల్మషం= కల్మషరహితములకును, అను ఈ౯ శ్రీశబ్దమునకు చెల్లును.

క॥ ఈశునిరాణియుమరివా। ణీశుని సతిక లక్ష్మి గీర్వాణాపు
రీశా। భామసిరులను పెండ్లికి। శ్రీశబ్దంబంచు చెప్పు శ్రీధరపుత్రా

### (శ్రీకరశబ్దభేదః)

శ్లో॥ (౨) సువర్ణాంబరభూషంచ రాజాకులసతీమణిః।
ధాతాశ్వాంస్త్రీరత్నంచ నారీణాంచ పయోధరః॥

టీక॥ సువర్ణః - బంగారమునకును అంబరః - బట్టలకును భూషణ

అలంకారమునకు రాజా - రాజులకును కులసతీ మణిః - సత్కులస్త్రీలకును ధాతాశ్వః- తెల్లగుఱ్ఱమునకును, స్త్రీ - స్త్రీలకును, రత్నః - నవరత్నములకును, నారీణాంచపయోధరః- స్త్రీలకుచములకును, యీ9 శ్రీకరశబ్దమునకుజెల్లును.

క॥ శ్రీకరశబ్దంబనగను। నాకసమందున్నయట్టి యైరావతమున్। ప్రాకటస్త్రీలకునీవే। రేకంబై చెల్లు పార్వతీశమహేశా॥

(చిత్రజశబ్దభేదః)

శ్లో॥ చిత్రజంచిన్మయాకారం ప్రద్యుమ్నంచప్రబోధకః।
కవిత్వాద్వచనశ్చైవా హంకారంబతిరౌద్రకః॥

టీక॥ చిన్మయాకారః- విరాడ్రూపానకును, ప్రద్యుమ్న — మన్మథునకును- ప్రబోధకః— గురుబోధకును, కవిః= కవీశ్వరునకును, వాగ్వచనఘగర్జణికును, హంకారః - కోపమునకును, రౌద్రః — తీక్షణానకును, యీ8 చిత్రజశబ్దమునకుజెల్లును.

ఉ॥ ఉత్తమరూపవంతునకు వాగ్గనితావచనానురాగ। సద్వ్యాప్తగురుత్వవాన్వయ మధువ్రతచిత్రజుడాది దేవుడుర్। మత్తుగనున్నమానవుని మాటకుమేలగుసత్కవిత్వముర్। చిత్రజశబ్దమందురిల శ్రీకరకంఠ ఉమామహేశ్వరా॥

(మహీజశబ్దభేదః)

శ్లో॥ మహీంధరమహీజంచ సాగరంచసరోవరః।
హేమమౌక్తికరత్నంచ దుస్వధూమాధ్యుతికీటకః॥

టీక॥ మహీధరః- పర్వతములకును మహీజః—చెట్లుకును సాగరః-సముద్రముకును, సరోవరః- తటాకములకును, హేమః - బంగారముకును, మౌక్తికః ముత్యములకును రత్నః-నవరత్నములకును దుష్వధూ-పుట్టకొక్కుకును ద్యుతికీటకః— ఆరుద్రపురుగుకును యీ౧౦ మహీజశబ్దమునకు చెల్లును.

చ॥ చెలిమిగసాగరంబులు సమిష్టితచెట్లకుపర్వతాళికిన్। అగణితరత్నమౌక్తికసహాయత పుత్తడిపుట్టగొక్కుకున్। నగిమరియద్రదామరలు నేకులు ఘోరముళైనమార్గముల్। నగునుమహీజశబ్దమననందితురంగ భుజంగకంకణా॥

(పయోధరశబ్దభేదః)

శ్లో॥ తటాకాభ్రనదీతీరౌ గంగాసాగరగౌతమః।
స్త్రీకుచద్గోకుచంచైవ దుగ్ధవృక్షప్రముచ్ఛతే॥

టీక॥ తటాకః— కోనేలకును, అభ్రః- మేఘములకును, నదీతీరౌ ఏటిఒడ్డుకును, గంగా - ఆకాశగంగకును. సాగరః = సముద్రమునకును గౌతమః- గోదావరికిని, స్త్రీకుచః- స్త్రీలయొక్కకుచములకును, గోకుచః- గోస్తనాలకును, దుగ్ధవృక్షః= పాలుగలచెట్లకున్ను, యీ౧౦న్ని పయోదరశబ్దమునకుచెల్లును.

చ॥ కరులును యశ్వసంఘములు కారుమహీపములూష్టపంక్తికిన్। మరియుపశుక్ర వ్రజంబులును మానవస్త్రీలు సుధాప్రయుక్తమై। ధరణిజనించు వృక్షములు ధారుణిలోనొకపేరుజెల్లును। ద్రురగఫణాఫణాంకితమహోజ్వల తేజలలాటలోచనా॥

(పయోజశబ్దభేదః)

శ్లో॥ పయోజఃపంకజంభాను నవనీతదధీఘృతం।
సుధాకరపీయూషంచ తక్రనక్రజలాశయః॥

టీక॥ పంకజః-పద్మములకును భానుః - సూర్యునకున్ను నవనీతః-వెన్నకు దధిః - పెరుగుకును ఘృతః - నేతికిని సుధాకరః—చంద్రునకును పీయూషః-అమృతమునకును తక్రః-చల్లకును నక్రః- మొసళ్లకును జలాశయః-చెరువులకును యీ 9న్ని పయోజశబ్దమునకు చెల్లును,

చ॥ సరసిజపంక్తికల్వలు ప్రసన్నతసూర్యుడు చంద్రబింబము౯। మరియుదధీఘృతంబునకు మంచిజలంబుకుచల్ల కెన్నగాబరుగును వెన్నకిట్లనుచు పండితులెల్లధరిత్రిలోపల౯। తలచిరచింతు రెల్లడలతత్త్వనిధాన ప్రధానమందిరా॥

(చరశబ్దభేదః)

శ్లో॥ పక్షీమృగసమీరంచ కీటకంయానపాత్రకః।
భూరజశ్చంద్రసూర్యశ్చ చరశబ్దప్రముచ్చతే॥

టీక॥ పక్షిః- పక్షులకును, మృగః- మృగములకును, సమీరః గాలికిని, కీటకః- పురుగులకున్, యానపాత్రః- నావకును, భూరజః= దూళికిని, చంద్రః= చంద్రునకును, సూర్యః- సూర్యునకును, యీ 8 చరశబ్దము నకు చెల్లును.

క॥ కరువలికి కీటకములకు। మరిచంద్రార్కులకు మేఘమండలమునకు౯ ।ధరణీపరాగమునకు। చరశబ్దంబంద్రు బాలచంద్రకిరీటా॥

(అచలశబ్దభేదః)

శ్లో॥ అచలాలయవిఘ్నంచ వాపీకూపతటాకహా।
గృహాలోహఘటాశ్చైవ ధరిత్రీధరశేఖరః॥

టీ॥ అచలాః-దేవాలయములను విఘ్నాః-విఘ్నములకును వాపి- నడతటాములకును కూప-నూతులకును తటాకః-కోనేరులకును గృహః-ఇండ్లకును లోహా పంచలోహములకును ఘటః-కుండలకును ధరిత్రి- భూమికిని ధరణీధరః పర్వతములకును యీ 9ని అచలశబ్దమునకు చెల్లును.

ఆ. వె॥ అచలశబ్దమునగనజలంపుట్టిల్లును। గుళ్లుగోపురములుకుధరములును। నడతటాకనూతులాక్క శబ్దముచెల్లు। సంప్రమజగదధిశ సాంబకేశ॥

గద్య॥ ఇదినానార్థ విశ్వనిఘంటే
మేకశబ్దప్రయోగః
సర్వం తృతీయసర్గః



క॥ ఈవిశ్వనిఘంటువెవరుభావంబునజదివి రేనిపండితులవనిన్।
భావించిప్రస్తుతింతురు। శ్రీవిభుకృపచేత శబ్దశీలురగుదుర్॥



శ్రీ వేంకటరమణ సహాయః

-(విశ్వనిఘంటు)-

## చతుర్థ సర్గ ప్రారంభము

(భద్రశబ్దభేదః)

శ్లో॥ భద్రేభద్రేభమాంగళ్యే కీరయోర్భద్రపీఠయోః।
సమాఖ్యేపాదరేన్నారీ పద్మనారాయణేశ్వరః॥

టీక॥ భద్రః = మంగళప్రదమునకును, భద్రేభః యేనుగుకును, మాంగళ్యే - శుభమునకును, కీరయో = చిలుకలకును, భద్రపీఠయోః - సింహాసనమునకును, పాదరే - పాదరసమునకును, నారీ స్త్రీలకున్ను, పద్మా = పద్మములకున్ను, నారాయణః = విష్ణువునకు, యీశ్వరః - శివునకును, యీ 9న్ని భద్రశబ్దమునకు పేర్లున్ను.

(ఖేచర శబ్దభేదః)

శ్లో॥ వైనతేయః పక్షిమేఘౌ సమీరః శ్శశిభానునా।
గ్రహతారకాభ్రనిర్ఘోషో అసురామరఖేచరః॥

టీక॥ వైనతేయః-గరుత్మంతునకును పక్షిః-పక్షులకును మేఘః-మేఘములకున్ను సమీరః-గాలికిన్ని శశి -చంద్రునకును, భాను- సూర్యునకున్ను గ్రహా-నవగ్రహములకును, తారా-చుక్కలకును, అభ్రనిర్ఘోషో-ఉరుములకును అసురా- రాక్షసులకును అమరా-దేవతులకును యీరీతి ఖేచరశబ్దమునకు చెల్లును.

(ధారాశబ్ద భేదః)

శ్లో॥ ప్రియాణేజవయానేచ ఝురీనాంనిగతోదకే।
వర్షభాషణగాంభీర్యే ధారాశబ్దప్రకీర్తితః॥

టీక॥ ప్రియాణః= ప్రియాణముసున, జవ= వేగముకును, యాన- వ డకకున్ను, ఝురీ = ప్రవాహముకును, నిగతోదకః = పారిననీళ్లకును, వర్ష= వర్షముకును, భాషణః- మాటలకును , గాంభీర్య= గాంభీర్యము కును, యీశి, ధారశబ్దమునకు చెల్లును.

(రామశబ్దభేదః)

శ్లో॥ జామదగ్న్ని రాఘవేయా కాళందీభేదనోఝురీ।
స్వరూపంచస్వయోషంచ రంహాయోశ్చశుకాదయః।

టీక॥ జామదగ్ని= పరుశరాములకును, రాఘవేయా = రఘురాములకు ను, కాళిందీభేదనః= బలరాములకును, ఝురీ= కొండ ఝురులకును, స్వ రూపే= చక్కదనముకున్ను= స్వయోషః=తనభార్యకున్ను, శుకాదయం= చిలుకలుమొదలగువానికిని, యీశిన్ని రామశబ్దమునకు చెల్లును.

(జలజాతశబ్దభేదః)

శ్లో॥ పద్మేందీవరకల్హార అంబుసూనేషుమత్స్యపః।
ఇత్యాదిజలజంతూనాం జలజాతప్రహాచకః॥

టీక॥ పద్మః-పద్మములకును యిందీవరః-నల్లకలువలకును కల్హార- యఱ్ఱకలువలకును అంబుసూనః - పద్మములకును మచ్ఛరః- సెన్లిచేపలకును- యిత్యాదీజలజంతూనాం -ఉదకములో నుత్పత్తియెయ్యె జలజంతువులన్నిటికి నిజలజాత ప్రకీర్తితః జలజాతశబ్దమునకు చెల్లును,

(ఖగశబ్ద భేదః)

శ్లో॥ ఖగచంద్రార్కపక్షీణాం వైనతేయాదియండజః।
అథాప్సరోదేవా మునిబ్రహ్మర్షిణోద్భవః॥

టీక॥ చంద్రః-చంద్రునకును అర్కాః- సూర్యునకును పక్షిః -పక్షులకును వైనతేయాది గరుత్మంతుడు మొదలైన అండజః-గ్రుడ్లలో పుట్టినవాటికిని అప్సరః=అప్సరసలకును దేవః-దేవతలకును మునిః-మునీశ్వరులకును, బ్రహ్మర్షిణోద్భవః- బ్రహ్మముఖములను పుట్టినవారికి యీ 9 ఖగశబ్దము చెల్లును.

(ఉరగశబ్ద భేదః)

శ్లో॥ ఉరగేశిశుర్వాయు భుజంగోదీర్ఘమత్స్యపః।
యిందీవరజలూకాయాం భీతిదైర్యేషు రోగయోః॥

టీక॥ శిశుః= శిశువులకు వాయు= గాలికిని, భుజంగః= పాములను దీర్ఘమత్స్యః= పెద్దచేపలకును, శ్రీ= సంపత్తులకును యిందీవర= పద్మములకు, జలూకాః- జలగలకును, భీతి= భయమునకును- ధైర్యేషు- ధైర్యమునకున్ను రోగయోః- రోగికిన్ని, యీ 12 ఉరగశబ్దమునకు చెల్లును.

(ధారాశబ్ద భేదః)

శ్లో॥ ధారాధరోకులాద్రీణాం జత్కలీంద్రనిలాశరః।
భుజంగాధిపతిర్వ్యాజే ఆదిశేషాంబుకేసదా॥

టీక॥ ధారాధరః- మేఘములకును కులాద్రి సప్తకులపర్వతములకును జితే- జయించేడముకును, కరి= ఏనుగుకును ఇంద్రా = ఇంద్రునకును అనిలాః గాలికిని శరః- బాణములకును భుజంగాదిపః = ఆదిశేషువుకును

లక్షణే,, నాలుగుకాళ్లజంతువులకును, కూర్మాః = తాబేళ్లకును, అంబుః— జలమునకును, ఈపదిన్ని ధారశబ్దమునకుచెల్లును,

(చిరాయుశ్శబ్దభేదః)

శ్లో॥ చిరాయుశ్శాల్మలీకాక ఘూకమచ్ఛవిహంగమః।

టీక॥ శాల్మలీ= బూరుగచెట్టునకును, కాకా— కాకికిని, ఘూకః- బండికూబకును, మచ్ఛః- మచ్ఛములకును, విహంగమః- పక్షులకును, యీవిన్ని చిరాయుశబ్దమునకు చెల్లును,

(విషధరశబ్దభేదః)

శ్లో॥ విషధరాభ్రిగౌరీశ శేషకాసారవారధిః॥

టీక॥ అభ్రిః- మేఘములకును, గౌరీశః — ఈశ్వరునికిని, శేషా— శేషువులకును; కాసార- కొలనునకు, వారధిః- సముద్రునికిని, యీవిన్ని విషధరశబ్దమునకుచెల్లును.

(వివిధశబ్ద భేదః)

శ్లో॥ వివిధంచిత్రవర్ణాంచ బహూ రూపబహూకిృమాత్ ॥

టీక॥ చిత్రవర్ణః- నానావర్ణములకును, బహురూప" బహురూపాలకును, బహుక్రియాత్" అనేకక్రియములకును, యీవిన్ని వివిధశబ్దమునకు చెల్లును.

(ధావ శబ్దభేదః)

శ్లో॥ ధావోధుకీంపృజన తీవ్రక్రోధవిభీషణః॥

